# పసిడి మువ్వలు

(పద్య కవితా సంపుటి)

వేముగంటి నరసింహాచార్యులు



ప్రచురణ :

**సాహితీ వికాస మండలి**

**సిద్ధిపేట.**

# పసిడి మువ్వలు

## వేముగంటి నరసింహాచార్యులు

# PASIDIMUVVALU

## Vemuganti Narasimhacharyulu

ప్రచురణ : జులై, 2000

వెల : రూ॥ 20/-

ప్రతులు : 500

ప్రతులకు : వేముగంటి నరసింహాచార్యులు
రామమందిరం, పారిపల్లి వీధి,
సిద్ధిపేట - 502 103, జి॥ మెదక్.

ముద్రణ : **శ్రీ వాసవి ప్రింటర్స్**
మేన్‌రోడ్, సిద్ధిపేట, ఫోన్ : 24125.

# నామాట

నేను పద్యకవిని. పద్యం నాకు ప్రాణం. అయితే ఈనాడు కొందరు పద్యకవితకు కాలం చెల్లిందని అనుచితంగా మాట్లాడుతున్నారు. పద్యకవితపై ద్వేషం చూపిస్తున్నారు. ఇది వారి అజ్ఞానాన్ని తెలుపుతున్నది. నేడు ఎందరో పద్యకవిత వ్రాస్తూ ఆధునిక సామాజిక స్థితిగతులను తమ కవితలో ప్రతిఫలింప జేస్తున్నారు. ఇవ్వాళ్ల తెలుగుకవితావాహిని పద్య, గేయ, వచన ప్రక్రియారూపంలో మూడు పాయలుగా ప్రవహిస్తూ ఉన్నది. కనుక కవులు ఏ ప్రక్రియనూ ద్వేషించవలసిన అవసరము లేదు. దూషించవలసిన అవసరం అంతకన్నా లేదు. ఉదాత్త భావబంధురమైన ప్రతి కవితా ప్రక్రియనూ ఆదరించవలసినదే. ఇది నా నిశ్చితాభిప్రాయం.

ఈ నా పద్యకవితా సంపుటికి ఆర్థికంగా సాయపడిన రిటైర్డ్ తెలుగు పండితుడూ, సహృదయుడూ అయిన శ్రీ చుంచుమల్లయ్యకు ఆశీఃపూర్వకమైన అభివందనలు తెలుపుతున్నాను. చక్కని చిత్రాలంకృతితో కవరుపేజీని వైసేసిన ప్రముఖ చిత్రకారుడు శ్రీ ఎం.డి. రుస్తుంకు ధన్యవాదాలు. గ్రంథ ముద్రణ కార్యాన్ని చక్కగా సంతరించిన శ్రీ వాసవి ప్రింటర్స్ అధినేత శ్రీ గందెశిరి శ్రీనివాస్‌కు కృతజ్ఞతలు.

వేముగంటి నరసింహాచార్యులు

# నివేదన

ప్రముఖ కవి శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు పద్యకవి
ప్రఖ్యాతి వహించారు. 40 వరకు కృతులను సంతరించి మెదకు జిల్లా
అగ్రగామికవిగా నిలిచారు. వేముగంటివారు మా సాహితీ వికాస మండ
అధ్యక్షులుగా నుండి సిద్ధిపేట ప్రాంతంలో సాహితీ చైతన్యాన్ని కలిగించా
మెదకు జిల్లా అధ్యక్షులుగా నుండి జిల్లాలో సాహిత్య సౌరభాన్ని వ్యాపింప జేశా
వీరు ఆంధ్రదేశంలోని అనేక ప్రాంతాలలో సత్కారాలు పొందారు. పురస్కారా
అందుకున్నారు.

సాహితీ వికాస మండలి పక్షాన సిద్ధిపేటలో వివిధ సాహి
కార్యక్రమాలు నిర్వహించబడినాయి. ప్రసిద్ధులైన కవిపండితులు
కార్యక్రమాలలో పాల్గొని కవితాగానాలూ, సాహితీ ప్రసంగాలు చేసి ప్రజల
సాహిత్యాబిలాషను పెంపొందింపజేశారు. కవులలో రచనా కృషి
ప్రోదిచేశారు. వికాస మండలి దాదాపు 30 పుస్తకాలు ప్రచురించింది.

మండలి అధ్యక్షులైన వేముగంటివారు తమ ఈ పద్యకవి
సంపుటిని వికాసమండలి పక్షాన ప్రచురించుటకు సమ్మతించడం
భాగ్యంగా భావిస్తూ వారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

తుమ్మ బాలరా
కోశాధ్యక్ష

# శ్రీ చుంచు మల్లయ్యకు
# ఆశీరభినందనలు

శ్రీరాముడు కరుణామృత
వారిధి, ధర్మస్వరూపభాసురుడును ఇం
పారగ బ్రోచుత గుణసం
భారుండై వెలయు చుంచుమల్లయ నెపుడున్ !

రాజమాంబికా వేంకటరాజపుణ్య
దంపతుల గర్భ శుక్తిముక్తా ఫలముగ
జననమందినవాడు సౌజన్యయుతుడు
ఆంధ్ర శారద సత్కృప నందినాడు

సత్యమ్మ ధర్మపత్నిగ
నిత్యము సుఖజీవనమ్ము నెరపు సుజనసాం
గత్యమ్ము కలుగు వంశపు
ముత్యము మల్లయ్య అలరు ముదితాత్ముండై

డంబము లేనివాడు, కప
టంబు నెరుంగని వాడునున్, నిరా
డంబర జీవనుండు, వికట
త్వమొకింతయు లేనివాడు, ని
త్యంబును నీతి రీతి సుప
థంబున వర్తిలువాడు, శ్రేయమున్
పంబిన మల్లయాహ్వయుడు
భాసిలు ధర్మవిధాన సాధనన్

మనసు మెత్తన, మరి మాట మెత్తనయు, వ
ర్తనమునందు మెత్తదనము గలిగి
పదుగురకును ప్రీతిపాత్రుడై మల్లయ్య
సచ్చరిత్రుడని యశమ్ము నందె

నిండు మనసుతోడ తెలుగు పండితుడుగ
నేర్మి చెలగ ఉద్యోగము నిర్వహించి
పదవి విరమణ గావించె ప్రజలు పొగడ
చుంచు మల్లయ్య సద్గుణశోభితుండు

నేర్పుతో విద్యను నేర్పి విద్యార్థి
        వర్గము హృదయములు చూరగొనినాడు
వేడుక చెలిమితో తోడి ఉపాధ్యాయ
        బృందము నాదర మొందినాడు
కర్తవ్యనిష్ఠా ప్రకాశమ్ముతో అధి
        కారుల మన్ననల్ గాంచినాడు
మంచితనమ్ము సారించి బాంధవకోటి
        అభిమాన పాత్రుడై అలరినాడు

పెద్దలను, గురుజనముల వినయమెసగ
గౌరవించెడు మేలిమి కలుగు వాడు
చుంచు మల్లయ్య సౌష్ఠవాభ్యంచితుండు
ఊర్జితుండయి చిరకీర్తి నొందుగాత !

సౌశీల్యము, సౌహార్దము
ఆశయముగ జీవితమ్ము నడరించు సదా
పేశల హృదయుడు మల్లయకు
ఆశీరభినందనముల నాపాదింతున్

ఆయురారోగ్యముల తోడ అలరుగాత !
భోగభాగ్యాలతో తులదూగుగాత !
నిత్యసత్యసౌఖ్యమున రాణించుగాత !
చుంచు మల్లయ్య బంధురసుకృతరాశి.

వేముగంటి నరసింహాచార్



ముద్రణ ద్రవ్య దాత

**శ్రీ చుంచు మల్లయ్య**

సిద్ధిపేట.

"వివిధ రీతీ వికాసమ్ము విస్తరిల్ల
నవ్య భావవిలాసమున్ చవుకళింప
శారదాదేవి చరణాంబుజముల మ్రోయు
పసిడిమువ్వల సవ్వడి పద్యకవిత"

# సూచిక

# గిరిరాజు

కొండల రాయడా! చలువ
గుండెలలో కరుణార్ద్రభావముల్
నిండినవాడ! నూత్న
రమణీయ కథా మహనీయపుణ్యముల్
పండిన వాడ! మామహిత
భారత భూమికి అండదండగా
నుండినవాడ! నిన్ను మధు
వూరెడు కమ్మని తెల్గుకైత పూ
దండ నలంకరింతు బహుధా
వినుతింతును నీ మహోన్నతిన్

జిలుగు వన్నెలతోడ కాశ్మీరలక్ష్మి
చరణ పీఠము కైసేయ, భరతమాత
ధర్మమణిమకుటమ్ముగా తలధరింప
అలరుమా మానవశ్రేణి అంజలింప

చల్లని చేతులన్ నిమిరి
శాంతికపోతము లేతరెక్కలన్
మెల్లన దువ్వి మాభరత
మేదినివీథుల మింటిచాయ వ
ర్తిల్లగ జేసి మా బ్రతుకు
తీరు సుఖమ్ముగ సాగునట్లు భా
సిల్ల నొనర్పుమా తుహిన
శీకరశీతదృగంచలంబులన్

పార్వతీ పరమేశ పరిణయ వైభ

వంబును సంతరించిన పుణ్యమూర్తి

మంగళదాయిని గంగా స్రవంతికి

మురిపాలముత్యాల పురిటిగీము

భారత జనని సౌభాగ్యంబు బింబించు

తనుపైన మాణిక్యదర్పణంబు

మహనీయ కమనీయ మహిమాలయముగ

ప్రతిష్ఠ నార్జించిన దేవతాత్మ

కాళిదాసాది తత్కవి కావ్యసౌధ

వీథిలో నిత్యనూతన వివిధగతుల

రూపుగట్టిన సౌందర్య దీపకంబు

నైన హిమశైలరాజ ! నిన్నభినుతింతు

తరతరాలుగ గుండెలో దాచుకొన్న

బుద్ధదేవుని కరుణా ప్రబోధ గీతి

తిరిగి విన్పించు మీనాడు దిక్కులన్ని

సుప్రశాంతి మాధుర్యవీచులను దేల

వెండికొండను గళమున బొండుమల్లె

దండగా దాల్చుకొన్న నీ ధన్యచరిత

శివకళాప్రతిపాదన శ్రీకరమగుచు

యుగయుగంబులుగా నిల్చియున్నదోయి !

వ్యాస వాల్మీకి ముఖ్యర్షి కవీంద్రుల
పావనవృత్తము వక్కణించి
జీమూత వాహన శిబి కర్ణు లాదిగా
త్యాగధనుల చరిత్రలు వచించి
రాణప్రతాప వీరశివాజి మున్నుగా
యోధులగాథల నుగ్గడించి
గాంధి, నేతాజి, భగత్‌సింగు మొదలైన
స్వాతంత్ర్యవీరుల సంస్మరించి

త్యాగ యోగ దివ్య ప్రతిభా గరిష్ఠ
మానితానూన దేశాభిమానములను
సంతరింపుము భారతసంతతికిని
అమిత మహిత యశస్సాంద్ర ! హిమగిరీంద్ర !

నీ మహిమకు, నీరుచిర
శ్రీమణి కాంతి ప్రసార శిఖరావళికిన్
కోమల మానసమునకున్
కైమోడ్పులు హిమగిరీంద్ర ! కమనీయగుణా !



# ఆహ్వానము

కటిక చీకటి తెరలను కత్తిరించి
కాలమేఘాల జాలము తూలగొట్టి
లోకమున కెల్ల నూతనాలోక మొసగ
రమ్ముమిత్రుడ ! సుస్వాగతమ్ము నీకు

పుడమి గాసిల్ల బలుమంచు జడులు కురిసి
జడత మడతలు మడతలై కడలు కొనగ
మ్లానమానవ జీవిత ప్రాంగణమున
గీలు కొలుపుము చేతనా కేతనములు

ఉరవుగా తరుణారుణకరము సాచి
కసటు తొలగించి భూదేవి నొసటియందు
దీప్తిమత్ వహ్ని కుంకుమ తిలకరేఖ
దిద్దగా రమ్ము వెచ్చన దీటు కొనగ !

క్రొత్తవెలుగుల పొలపమ్ము గుస్తరించి,
పసిమి పచ్చని వన్నెలు ప్రస్తరించి
మేలు కొలుపుల పాటలు మేళవించి
వితతముగ సర్వజగతి జాగృతివహింప
రమ్ము మిత్రుడ ! సుస్వాగతమ్ము నీకు

నిచితనీరస భావసంకుచితమైన
సకల జనగణమానసాబ్జాతములకు
వికసనమ్ము, సుమాళపు విలసనమ్ము
నవదరింపు ముత్తేజమ్ము చవుకళింప !



# అమృత సేతువు

(శ్రీరాంసాగర్)

చవిటినేలలు పైరు పచ్చల నెసంగ
తెలుగుతల్లి కొంగున పైడి వెలుగుచెలగ
మేలుముల దొంతి శ్రీ గౌతమీస్రవంతి
వార్ధియై నిల్చె పోచముపాడు వద్ద

శ్రీ గోదావరి ! దివ్యభవ్యజలరాశీ !
నిత్యవాచాలవీ
చే గోష్ఠీ విభవా ! దయామృతరస
స్నిగ్ధాత్మవై ముగ్ధరే
ఖాగంభీరిమ చెంగలింపగ
తెలంగాణమ్ము నక్షీణ ధా
న్యాగారారం బొనరింప నిల్చితివి కాదా
సాగరా కారతన్

జనకసుతా సతీస్నాన పుణ్యోదక

పావనత్వము నొందినావు గాని

భద్రాద్రి శ్రీరామ పాదపంకజమరం

దరసమ్ము చవి చూచినావు గాని

నన్నయ్య భారతామ్నాయమ్ములోని

విన్నాణమ్ము తెలుసుకొన్నావు గాని

తరతరాల చరిత తరగల రవళి

గానమున విన్పించుచున్నావు గాని

ఎన్నడేని నవోదయాసన్న మతిని

నిలిచితివె తెల్గు పాలము పండించు కొరకు

నేటి కీరీతి కడలివై నిలిచినట్టి

నిన్ను సన్నుతింతును స్రవంతీమ తల్లి !

స్వాదు పయస్వినీ ! విమల

భావమనస్వని ! దిక్ప్రసారితా

మోదయశస్వినీ ! భువన

పూత మహస్విని ! గాఢ దైన్యపుం

జేదును మ్రింగి డీల్పడి

కృశించు కృషీవల జీవితంబు లా

హ్లాదము నొంద జేసితివి

అంబుధిరూపము దాల్చి గౌతమీ !

పిసిని గొట్టు విధాన వెసనొక్క చినికేని

రాల్చని నీరద ప్రతతి జూచి

పాతాళలోకపు లోతు ముట్టగ నెంచు

నూతుల గోతుల రీతి జూచి

వరదమత్తడి రాని బురద చిత్తడి లేని

చెరువుల దొరువుల చేటు జూచి

కరుణమాలినవాని కరకు గుండియ వోలె

చెమ్మగిల్లని వాగు స్థితిని జూచి

పండబారిన వరిపొలాలెండబారి

గుండెలవియింప మిక్కిలి గోడు జెందు

కర్షకుల కాసదివ్వెగా కడలి వగుచు

వరలితివె గాదె పోచముపాడు వద్ద !

కొండలు, బండలున్ గడచి

కోనలు, కానలు దాటి ఆంధ్ర భూ

ఖండము తోయపూర్ణమగు

కాల్వల నిల్వున సందడింపగా

తొండలు గ్రుడ్లు వెట్టు నెరి

దోయిడి భూములలోన బంగరున్

పండగ వార్ధివై నిలిచి

భాసిలు నిన్ను భజింతు గౌతమీ !

బీళ్లు పచ్చని వరిమళ్ళుగా తులకింప

మ్రోళ్ళు చివుళ్లతో పులకరింప

నిరుపేద రైతింట సిరివెలంది చరింప

ధాన్యము గరిసెల దండడింప

చిరుకాల్వ నీటి తుంపరవరాల్ కురింప

చెట్టు చేమలు రసశ్రీ వహింప

జలవిహంగావళి కలరవం బొనరింప

ఫలపుష్పవనములు పరిమళింప

పడతి పదముల వెండి మువ్వల విధాన

గలగలారావ వీచికల్ కందళింప

జలధిపై నిల్చి కాల్వలై జాలువారు

పుణ్యవాహిని నీకు కైకోడ్పులమ్మ !

అమల తుషారవారములు

హారములై చెలువారగా శుభో

ద్యమ కమనీయ కాంక్షయెడదన్

తడలెత్త పటిష్ఠ సేతు చం

క్రమణ మొనర్చి వాకవయి,

కాలువవై ప్రవహించి, నేల త

ల్లి మొగమునందు భాగ్యనవ

రేఖలు దిద్దితివమ్మ గౌతమీ !

తెలుగుంబల్లెలు పైరులు

వెలుగుం బళ్లెరములగచు విలసిల్ల భవత్

జలపూరము మాపొలముల

బలసారము గౌతమీ స్రవంతీ మణిరో !

వడలిపోయిన సామేను తడిసిపోయి

జాలిగా మాతెలంగాణ నేలతల్లి

పలుకరించెడి, నోడలెల్ల పులకరింప

అమృతధారలు కరిపించి ఆదుకొనుము

కామితప్రద ! గోదావరీమ తల్లి !

మా తెలగాణ నేడు

జలమాంధ్యముతో దురపిల్లుచున్, నదీ

మాతృక తాప్తి కోసరము

మార్గగవేషణ చేయుచుండె ఓ

పూత తరంగిణీ ! మిగులు

భూములు పైరుల పచ్చగిల్లగా

బ్రాతిగ పెంపుగూర్చు మవి

రామ పయఃపరిపూర్ణధారలన్



# దీక్షా కంకణము

కక్షల్, వర్గవిభేదవాదములనున్,
కార్పణ్యదోషంబులన్
ప్రక్షాళించి విచక్షణామతిని
దీవ్యద్భవ్య కావ్యావళీ
సాక్షీభూతముగా నిరంతర జగత్
సౌహార్ద సంధాతవై
దీక్షాకంకణమున్ ధరింపవలె
జాతీయాభివృద్ధ్యర్థమై

అక్షీణమ్మగు వైదికా చరణ
కార్యమ్మాని మాతృక్షమా
ర్థ క్షే మమ్మును కాంక్ష సేయుచు లసత్
ప్రాచీన సౌభాగ్యసం
రక్షాదీక్ష భజించి సౌమ్యసరణిన్
రాజిల్ల నుత్తేజతన్
దీక్షా కంకణమున్ ధరింపవలె
జాతీయాభివృద్ధ్యర్థమై

రూక్షక్షారుణకాంతి రేఖలను నిర్మూలమ్ము గావించుచు
చక్షుః పద్మములన్ దయామధురఝురిన్ సారించి చైతన్యమై
లక్షణ్యమ్మున జీవితాంగణమునన్ గ్లౌశోభ సంధిల్లగా
దీక్షా కంకణమున్ ధరింపవలె మాతృక్షోణి రక్షార్థమై

# గోలకొండకోట

భద్రాద్రిరామ వివాహోత్సవమునకు

ముత్యాల తలబ్రాల మూటలంపి,

అద్దంకి గంగాధరాది కవీంద్రుల

కృతులందుకొనుటకు కేలుసాచి,

శేముషీ చతురతా శ్రీకి పేరొందిన

తెలుగుమంత్రిత్వపు కలిమి వలచి,

నెరజోదు తనము పండిన తెలంగాణ

భూమికి క్రొత్త మగటిమి మెరుగు పెట్టి

మత విభేదజాడ్యము లేని కుతుబుషాహి

పాదుషాలు సాగించిన పాలనమున

ఆంధ్రతాముద్రమౌళిపై నవధరించి

కొలువు దీర్చిన దీ గోలకొండకోట

వైరి రక్తము కత్తికి చూరలిచ్చు

దండనాథుని రసికత పిండుకొన్న

అచ్చతెలుగు కవిత్వపు పచ్చితేనె

చవు లెరింగెను సరసాంధ్రజనము లచట

అక్కన్న మాదన్న లెక్కివచ్చిన గుఱ్ఱములు
తిరుగాడిన భూమి లిచట
కంచర్లగోపన్న గానామృతమునకు
శిలలు ద్రవించిన తలము లిచట
శ్రీరామ పద సరసిజరజఃపాళి
పున్నెములు పూయించిన నెలవు లిచట
భోగ భాగ్యమ్ములు మూడుపూలారు
కాయలుగ వర్ధిలిన చిహ్నమ్ము లిచట

కలవు కలవుంచు ఘోషించు కంఠమెత్తి
ప్రత్యణువు, నాటి గాధలు త్రవ్విపోయు
ఈ చరిత్ర ప్రదేశ మీక్షించినంత
తనువు పులకించు మదికి మోదము ఘటించ

పునుగు పరిమళములు, మొగిలిపూటత్తరు
కమ్మదనము, పచ్చకప్పరంపు
వీడియమ్ము తావి వీడక గుమగుమ
లాడు నేమొ ఇపుడు గూడ నిచట

మానస వీధిలో మధుర

మంజుల నాదవిపంచి మ్రోయు మూ

సానదిసాని క్రొందరగ

చాలుల చల్లదనమ్ము గూర్చి మం

దానిల చామరమ్ము చెలువారగ

వీచుచుచు గోలకొండ సు

ల్తానుల రాజ్యలక్ష్మికి

విలాస వినోదమొసంగె నెంతయున్

చెలగు, తెలుగు తల్లి సిగలోని జాజిపూ

దండవోలె గోలకొండ కోట

అలరు, ఢిటవుజారనట్టి తెలుగువాని

గుండెవోలె గోలకొండ కోట



# పెద్దన

హద్దులు దాటు నేర్పు

చెలువార ప్రబంధవిధాన కర్తవై

ముద్దుల తెల్గుకైతకు

అపూర్వ మనోజ్ఞ కళావిలాసముల్

దిద్దితివంట నాటికవి

ధీరులు అబ్బుర మంది చూడ నో

పెద్దన సత్కవీంద్ర !

కనిపింప రికన్ నినుబోలు సత్కవుల్

రంగదనూనభావ

సువిరాజితమై మకరంద మాధురుల్

పొంగులువారు నీ

కవనపుంజిగి మెచ్చుచు నీ పదాబ్జమున్

బంగరుగండ పెండెరమునన్

గయిసేసెను కృష్ణరాయలు

ప్పొంగిన గెండెతోడ

కవి భూషణ ! ఓ కవితా పితామహా !

కూరిమిమీర రాయ

లోనగూర్చిన చక్కని మందిరమ్ము, నో

రూరు రసాన్నభోజనము,

ఊయెలమంచము, కమ్మతావి క

ర్పూరపుతమ్ములమ్ము మనమున్

తనియింపగ వ్రాసినావు బం

గారు కలమ్ము తోడ

మనుగాథను నిగ్గులు పోతపోయుచున్

నీవు కవనపుచలువ పన్నీరు చిలికి

పేర్మిపోషింపగా నభివృద్ధి గన్న

కృష్ణ రాయలవారి సత్కీర్తి వల్లి

పూచి వలపించె శాశ్వతమ్ముగను దెసల.

※ ※ ※

# ఇంద్రధనుస్సు

మొలక పచ్చలు కుప్పగా బోసినట్లు
పసిమి బంగారమును జోడు పరచినట్లు
లేగులాబి వన్నెలను గీలించినట్లు
సాంద్రముగ వెల్గుచున్నది ఇంద్రధనువు

కుంచెగొని రంగులెల్లను కుదురు పరచి
వ్రాయునే చిత్రకరు డిట్టి వర్ణములను
దైవనిర్మితమైన సౌందర్యమునకు
సాటివచ్చునె నరుల ప్రజ్ఞాబలమ్ము

అఖిలమును సృష్టిచేయు విశ్వాధిపతికి
కాలపురుషుడుపట్టు శృంగార గరిమ
గులుకు నవరత్నముల మేలి గొడుగనంగ
నెడద పులకింప విలసిల్లె నింద్రధనువు

రంగు రంగుల ఈ సుందరంపుధనువు
ఏ మహాశిల్పి మింట చిత్రించినాడొ ?
తెలుసుకొనువాడులేడిల తెలియజెప్ప
వాడులేడిది వర్ణింప వశము గాదు



# ఆకాంక్ష

శైశిరాఘాత సంపాత సంకటమున
గడలుకొన్నట్టి జాడ్యము సడలిపోయి
మధుర మధుమాస శోభారమా విలాస
మలరవలయును కాననప్రాంగణముల

ప్రకృతి జనయిత్రి నిశ్వాస పవనపూర
ములకు గూడ నదింపక మూగవడిన
శిలల గుండెల శిల్పలక్ష్మీపదాల
పసిడిమువ్వల సవ్వడు లెసగవలయు

గ్రీష్మలాలాటికా వహ్ని కీలలందు
శుష్కమై మండుటిసుకల సుడివడిన స్ర
వంతి కావళి విమలజీవన సమగ్ర
వైభవాంచితముగ సాగవలయు నెపుడు

కారుచీకటి రాతిరి కౌగిలింత
నలసిసొలసి నిద్రాణమైనట్టి జగతి
మేలుకొనవలె నవనవోన్మేషకలన
ప్రత్యుషోరాగరేఖికా స్పర్శనొంది.

పులకరింపులు, నాగేలిగిలకరింపు
లెడముగా బీడువారిన పుడమిపడతి
ఒలుకవలె ధాన్యమాన్యతా కలితమైన
పైరుపంటల పసిమి సింగారములను

మందమంద రోచిర్ఘృణ కందళముల
ఎడదలోతుల కొడిగట్టి అడజడిపడు
దీపకళికలు అవిరళోత్తే జనమున
క్రొత్త వెలుగుటూపిరి పోసి కొనగవలయు

పగలు సెగలయి పొగచూరి వెగటుగొలుపు
భావవీధుల స్నేహసుధా వికాస
మలముకొని సొంపు పెంపారవలయు సౌఖ్య
కారణమ్ములు, మంగళ తోరణములు

దీనభావము తార్కొని తీగలు తెగి,
నీరవమ్మైన విశ్వమాణిక్యవీణ
కోమలగ్రామ వైఖరుల్ కుదురుపరచి
పలుకవలయును శాంతిసౌభాగ్యగీతి



# మిలీనియం

క్రీస్తు పేరిశకము రెండు వేడేడులు
గడచిపోయె, మనను విడిచిపోయె
అవతరించినట్టి నవసహస్రాబ్దికి
స్వాగతము నేడు సంతరింతు

పక్షులవలె మింట పయనమ్ముచేయ
విమానాలు మలచు విజ్ఞాన మెంచి,
ఆటపాటల బొమ్మ లానందకరముగా
చిత్రముల్ చూపు వైచిత్రి నెంచి,
వింతగా మానవు డంతరిక్షపు శూన్య
తలమున తిరుగు ధీబలమునెంచి,
తోయమ్మునుండి విద్యుత్తును సృష్టించి
కాంతి శక్తిని గూర్చు గరిమ నెంచి,

అబ్బురమ్ము గలుగు నట్టులుగా చంద్ర
మండలంబునందు మానవుండు
పదము మోపె నన్న వాస్తవమ్ము దలంచి
విస్తుపోయె జగము వినుతిచేసె

మానవ మేధా బల మన
మానముగ వికాస మొంది, మానిత సృష్టిన్
మానవ జీవనమున సం
ధానించె అనూనరీతి నానాసుఖముల్

అణువిచ్ఛేద మొనర్చియు
గణనాతీతమగు శక్తి కల్పించియు మా
రణ హోమము గావించుచు
వణకించిరి ఘనులు జనుల భయము గొలుపుచున్

తాటి యాకులందు తరతరాలుగ నొప్ప
అక్షరములు ముద్రణాకృతి గని
అచ్చుపుస్తకమ్ములై మానవుల కెల్ల
హస్త భూషణమ్ము లగుచు వెలసె

నిత్యనూత్న ప్రపంచ సాహిత్యలతిక
క్రొత్త చిగురులు, పూవులు గుస్తరించి,
నవ పరిమళల హరుల సవురు నించు
నవ సహస్రాబ్ది కొనరింతు కైతజోత !

ఎన్ని యెన్ని వింత లెన్నెన్ని చిత్రము
లెంత గొప్పసృష్టి, యెంత పుష్టి
కడలుకొలిపె ? అట్టి గతసహస్రాబ్దిని
తలచుకొన్న మేను పులకరించు

సామ్యవాదమె మానవ గమ్యమనుచు
దీనబంధువుగా ప్రబోధించినట్టి
ఒకమహావ్యక్తి సిద్ధాంత వికసనమ్ము
గత సహస్రాబ్ది కొక నూత్న కళ నమర్చె.

కవులున్, గాయకులున్, కళాకరులు,

విఖ్యాత ప్రజానాయక

ప్రవరుల్, నూతన యంత్ర కల్పన కళా

పారీణవిజ్ఞాన శా

స్త్ర విశేషజ్ఞులు పుట్టిగిట్టిన మహా

సంవత్సరాలెన్నియో

ఇవురై తీయగ, చేదుగా గడచిపోయెన్

జ్ఞాపక స్ఫూర్తిమై

ఒక వంగ కవిరాజునకు జగా నోబులు

ప్రైజు లభించిన వత్సరమ్ము

కర్మంది యొకడు చికాగో సభన్ హైంద

వము నుగ్గ డించిన వత్సరమ్ము

ఢిల్లీ పురాన లాల్‌ఖిల్లా శిరాన

మువ్వన్నె జెండా నిల్చు వత్సరమ్ము

శ్రేయమ్ముగా భారతీయ రాజ్యాంగము

ప్రాదుర్భవించిన వత్సరమ్ము

చతురుడగు ఒక భారత శాస్త్రవేత్త

పన్నుగా మొక్కలకు ప్రాణమున్నదనుచు

ప్రకట పరచినయట్టి సంవత్సరమ్ము

గత సహస్రాబ్దికిని అలంకృతి ఘటించె

బానిస తనమున మ్రగ్గుచు
దీనముగా డీలువడిన దేశాలకు స్వే
చ్ఛానాథత్వమ్మును సం
ధానించిన వత్సరమ్ము ధన్యమ్మయ్యెన్

కవులను స్వాతంత్ర్యరవులను కబళించి
గమనించు సంవత్సరములు కొన్ని
నాయకమణులను గాయకాగ్రణులను
కమించిన సంవత్సరములు కొన్ని
రణహోమజనిత మారణ ధూమచయమున
కుమిలిన సంవత్సరములు కొన్ని
మానవతను కాల్చు మతకులద్వేషాగ్ని
రగిలించు సంవత్సరములు కొన్ని

జగతిలోన ఎన్నెన్నో విషాదగాథ
లావరించెను గత సహస్రాబ్దియందు
కుటిలమౌచు చరిత్రపు పుటలలోన
ముద్రితములయి అక్కటా ! మూల్గుచుండె

ఎల్లదేశము లొక్క యిల్లుగా మెలగక

వ్యోమ యానము చేయనేమి ఫలము ?

అవనిపై పగసెగ లారనిచో చంద

మామను చేరిన నేమి ఫలము ?

భేద భావమ్ములు వీడనిచో యంత్ర

సృష్టి గావించిన నేమి ఫలము ?

స్వార్థ పరత్వము వదలనిచో సైన్సు

వృద్ధి చేకూరిన నేమి ఫలము ?

భావుకమ్ముగ మానవతావికాస

భాసురమ్ముగ లోకము వరలకున్న

మానవుండు సాధించు విజ్ఞాన శాస్త్ర

మెంతగా పెంపునొందిన నేమి ఫలము ?

వివిధ పరిశోధనలను గావించి, మనుజ

కోటి కెంతయో మేలు చేకూర్చినట్టి

నేర్పుగల్గి చిరస్మరణీయులైన

శాస్త్రవేత్తల నీనాడు సన్నుతింతు

శాంతి, సౌఖ్యము, సౌహార్ద సౌమనస్య

సామరస్యములను సదా సంతరించి

త్యాగయోగ మాశయముగా సాగుగాత !

నవసహస్రాబ్ది క్రొత్త విన్నాణమలర

# వాల్మీకి

క్రౌంచ మిథున వియోగయోగమ్ము కతన
మనసులో నుండి ఉబికి వచ్చిన కరుణయె
శ్లోకమై మహాకావ్యవిస్ఫూర్తి నొందె

శోకము శ్లోకమై మధుర
సుందరబంధురమైన రామగా
థాకృతి సంతరించియు
సుధారసధారల పూర్తితోడ ము
ల్లోకము మానసమ్ములను
లోగొన జేసిన యట్టి ఓయి వా
ల్మీకి మహర్షి ! నీకు ప్రణమిల్లెద
అల్లెద కైత దండలన్

పుట్టన్ పుట్టియు తేనియ
లుట్టిపడగ కవిత చెప్పి ఉజ్జ్వలకవితా
పట్టాభిషిక్తుడైతివి
చిట్టలు నీచరిత గతులు శ్రీవాల్మీకీ !

ఓయీ వాల్మీకి మహ
ర్షీ ! యద్భుత రీతిగా రచించిన శ్రీ రా
మాయణము నిత్యమును పా
రాయణ యోగ్యమ్మునగుచు రంజిలెజగతిన్

అడవి మానిసివో లేక జడలు దాల్చి
తపము చేసిన మౌనివో ధన్యచరిత !
ఎవరివైన నేమీ మధుస్రవదపూర్వ
కృతిని రామాయణమ్ము రచించినావు

ధర్మస్వరూప విధానమ్ము మానవ
కోటివర్తనములో కుదురుపరచ
శరణాగతత్రాణ పరమ ధర్మమ్మును
చక్కగా జగతికి చాటిచెప్ప
ఏకపత్నీత్వదీక్షాకలనమ్మును
విశ్వమ్మునకు సదా వెల్లడింప
సకల ప్రజాళిరంజకమైన సత్‌పరి
పాలన లోకాన పాదుకొలుప

ధర్మయుతమును, జనసుఖదాయకమ్ము
రాజ్యపాలనాకలితమ్ము, రమ్యమైన
రామచరితము సుకృతిగా వ్రాసినీవు
అందుకొంటివి విశ్వసమాదరమ్ము

ఆహా ! రాముని పుంసాం

మోహన మూర్తిగను, ధర్మమూర్తిగ మధుర

వ్యాహారమ్మేపార స

మాహితముగ దిద్దినాడ వాదికవీంద్రా !

శ్రీయుత మైన రీతి విక

సించు కవిత్వపు మావికొమ్మపై

కోయిలపిట్టవై మధుర

కోమల గీతరసార్ద్రమైన రా

మాయణ దివ్యకావ్యపర

మార్థము గానమొనర్చి మానవ

శ్రేయము గూర్చినాడవు

ఋషి ప్రవరా ! కవివర్య ! వాల్మికీ !



# ప్రకృతి గీతి

ఓ నవోషస్స్వరూపిణీ ! ఓమనోజ్ఞ
సాంధ్యరాగిణి ! నైశప్రశాంతనిలయ !
ప్రకృతి లీలావతీ ! కళారాధనీయ
ఋతువులన్నియు నిన్నాశ్రయించి తిరుగు

తావకీన వినూత్న సౌందర్య గరిమ
మలచుకొన్నట్టి మధుమాస విలసనమ్ము
రెమ్మలై, కొమ్మలై, చిగురించిపూచె
మధుపరాగపరిమళ సంపన్న మగుచు

నీకవోష్ణ దీర్ఘనిశ్వాసపవమాన
వీచికలు స్పృశింప విహ్వలించి
కన్నెవాగు గొంతు సన్నమై లోలోన
గొణుగుకొనును జాలిగొన్నపాట

నీవినీల నేత్రాలక్రీనీడలందు
మెరుపుతీగల పందిళ్ళు పరచుకొన్న
తొలకరియొయిళ్ళ కౌగిళ్ళ పులకరించి
నేల భాగ్యరేఖావళిన్ దిద్దుకొనును.

నీదరస్మితామృతపు వేణికలదేలి
మబ్బుకాటుక రేకలన్ మలిపివేసి
శుభ్ర శారదకౌముదీ సురుచిరమ్ము
లై దిశల్ రెల్లు పూలమాల్యములు దాల్చు

మురిసి నీవు ముత్యాల జాలరుల వంటి
తెలిజిలుగు మంచుముత్యాల తెరలు దీర్చి
పచ్చచేమంతి రేకుల పైడిమేడ
నవతరించు హైమవతి శీలాంతరంగ

నీవు చూపిన అనురాగ భావదృష్టి
లక్షణమ్మున శిశిరవేళా విఘాత
శూన్య వనజీవితమ్ము విస్ఫుట పలాశ
పుష్ప రాగనవోదయమ్మును వహించు



# కార్గిల్ వీరుడు

కార్గిల్ సంగ్రామమున అ
నర్గళముగ పోరు సలిపి అరిసైన్యాళి
దుర్గర్వమణచి వీర
స్వర్గము చేరితివి పద్మపాణీ ! శూరా !

అభినవాభిమన్య ! ఆచార్య పద్మపా
ణీ ! నితాంత శౌర్యనిధివి నీవు
భరతమాత గర్వపడునట్లు యుద్ధము
సలిపినట్టి నిన్ను సన్నుతింతు

నీ శౌర్యము, నీ ధైర్యము,
నీ శక్తియు పద్మపాణి ! నీ సాహసమున్
రాశీభూతముగ భరత
దేశమునకు గొప్ప వన్నెదెచ్చెను వీరా !



# అక్షర జ్యోతి

ప్రాత దనాల నీడల తెరల్
పెను చీకటి నావరింప, ని
శ్చేతనులైన మానవుల
జీవిత సీమలు అందగింపగా
నూతన చేతనత్వపు
మనోహర కాంతిని గూర్చు అక్షర
జ్యోతికి జోత పెట్టెద
మహోన్నత భావి వికాస కాంక్షినై

అజ్ఞాన తిమిర చయమ్మును తొలగింప
అక్షరమ్ములు దివ్వెలగును గాత !
మూగవోయిన గొంతు రాగాలు పలుకగా
అక్షరమ్ములు మువ్వలగును గాత !
తెలివితో బ్రతుకులు కళకళలాడగా
అక్షరమ్ములు నవ్వులగును గాత !
కైసేతకున్ క్రొత్త కలిమి చేకూరగా
అక్షరమ్ములు రవ్వలగును గాత !

హర్షమున గుండె కువకువ లాడునట్లు
అక్షరమ్ములు బెళగువ్వలగును గాత !
సరసముగ దిశావలయము పరిమళింప
అక్షరములు మొగిలిమొవ్వలగును గాత !

అక్షరమ్ములు బారతీవీక్షణములు
అక్షరమ్ములు లోక సంరక్షణములు
అక్షరమ్ములు జీవిత శిక్షణములు
అక్షరప్రభ దిక్కుల నలరుగాత !

హృదయవీణావిధూత తంత్రీమనోహ
రస్వరములు, ప్రాణశ్రుతి ప్రస్తరములు,
విశ్వమానవచైతన్య విస్తరములు
అక్షరములకు భక్తియై నంజలింతు

ఎడదపాలకడలి వెడలించు తరగల
నురుగుచాలు, మిసిమి పెరుగు జాలు
సారగంధమొలుకు పారిజాతపుపూలు
అక్షయపువరాలు అక్షరాలు

మానవమ్లాన జీవి తోద్యాన సీమ
లోన సంతత సౌభాగ్య మూనుకొనగ
దేశవృక్షము పచ్చగా తేజరిల్ల
క్రొత్త చిగురులు, పూవులు గూర్పవలయు
అక్షరమ్ములు జ్ఞాన సంధుక్షణములు.



# తెలుగు పూజ

అన్నమార్యుని కీర్తనామృతలహరిలో
వేంకటేశ్వరుడు ద్రవించునాడు
కృష్ణమాచార్యుని గీతమాధురికి
సింహాద్రి అప్పడు తృప్తినందునాడు
క్షేత్రయ్య పదముల సింగారమున మువ్వ
గోపాలు డెలమితో కులుకునాడు
త్యాగయ్య కీర్తన రాగమోహంబున
శ్రీరాముడు పులకరించు నాడు

భక్తవరుడు కంచర్ల గోపన్న లలిత
గీతముల తీయదనమున ప్రీతి నొందు
దాశరథి యెద కరుణతో తనరు నాడు
తెలుగు సంగీతవాణి స్పందించె నాడు

వెనుకబాటు తనమ్ము పెక్కువగా చిక్కు
ఆంధ్రవాఙ్మయము పెంపందవలయు
సౌఖ్యప్రదముగ సస్యశ్యామలమ్ములై
తెలుగు సీమల వృద్ధి నొలయవలయు
తెరచాపలెత్తి మత్తిలి తూర్పుసంద్రాన
ఆంధ్రనౌకలు ఈదులాడవలయు
శాంతి సందేశముల్ జగతికి చాటింప
ఆంధ్ర ధ్వజము మిన్నంటవలయు

# అన్నమయ్యకు విన్నపాలు

సీ॥ పాపరాయని వేయి పడగలమయమ్మైన
ఏడుకొండలను తారాడు సొగసు
రంగారుమేలిమి బంగారు వన్నెల
ఆనంద నిలయ శోభాతిశయము
చూపరు హృదయాలు చూరాడు మూర్తిమత్
వేంకటేశ్వర కళా విభవ గరిమ
పల్కుతేనెలనొల్క వల్లభు మురిపించు
అలమేలు మంగమ్మ వలపు తలపు

తేటమాటలమూటగా నాటు కొలిపి
పాటలను సంతరించిన ప్రతిభ నీది
ఆంధ్రవాగ్గేయకార లోకాగ్రగణ్య !
అన్నమాచార్య ! నీ నేర్పు సన్నుతింతు

జానపద గీతముల నొప్ప జాణతనపు
బాణితెలిసిన విన్నాణి గాణవీవు
లాలిపాటల కవన లాలనము నీది
అన్నమాచార్య ! నీకు నా విన్నపాలు

సంగీతము, సాహిత్యము
సంగాతము చేయునట్లు జతగూర్చిన నీ
మంగళకర సంకీర్తన
సంగతి గానప్రపంచ సౌవర్ణనిధుల్

వేంకటపతి చరణసరో
జాంకితమై, అమృతభాండమై అలరుచు నీ
సంకీర్తన భాండారము
ఉంకువగా స్వామి కెంతొ ఉత్సవ మొసగెన్

# తెలుగు పూజ

అన్నమార్యుని కీర్తనామృతలహరిలో
వేంకటేశ్వరుడు ద్రవించునాడు
కృష్ణమాచార్యుని గీతమాధురికి
సింహాద్రి అప్పడు తృప్తినందునాడు
క్షేత్రయ్య పదముల సింగారమున మువ్వ
గోపాలు డెలమితో కులుకునాడు
త్యాగయ్య కీర్తన రాగమోహంబున
శ్రీరాముడు పులకరించు నాడు

భక్తవరుడు కంచర్ల గోపన్న లలిత
గీతముల తీయదనమున ప్రీతి నొందు
దాశరథి యెద కరుణతో తనరు నాడు
తెలుగు సంగీతవాణి స్పందించె నాడు

వెనుకబాటు తనమ్ము పెక్కువగా చిక్కు
ఆంధ్రవాఙ్మయము పెంపందవలయు
సౌఖ్యప్రదముగ సస్యశ్యామలమ్ములై
తెలుగు సీమల వృద్ధి నొలయవలయు
తెరచాపలెత్తి మత్తిలి తూర్పుసంద్రాన
ఆంధ్రనౌకలు ఈదులాడవలయు
శాంతి సందేశముల్ జగతికి చాటింప
ఆంధ్ర ధ్వజము మిన్నంటవలయు

పూలుపూచి పరిమళమ్ములు వెలార్చి
ఆంధ్రభాషాలత జగాన అలరవలయు
ఆంధ్రులెల్లరు భోగభాగ్యములతోడ
ఉల్లసిల్లగ స్వర్ణాంధ్ర మొప్పవలయు

నా తెల్గుతోటలో నవ్యకావ్యసుమాలు
విరిసి దిక్కుల నిండ పరిమళింప,
నా తెల్గు రత్నవీణా నిక్వణమ్ములో
తీయని భక్తి గీతికలు మొరయ,
నా తెల్గు మందిరాంతరమందు మేటి
శిల్పుల కళాసంపద ముమ్మరింప,
నా తెల్గు గగనాంగణమున వీరుల ఖడ్గ
విద్యుల్లతారుచుల్ విస్తరింప,

నా తెలుగు మనోహర దివ్య నాగరికత
ఖండఖండాలకెగబ్రాకి తాండవింప
నా తెలుంగు సత్కీర్తి కన్యాలలామ
అలవరింపగవలయు ముత్యాల గొడుగు



# అయోమయము

పూల కన్నెల కమ్మని మోవి మీద
చిందెడు మధుర మకరందమందహాస
మిళితధారల పాడు తుమ్మెదల రేడు
దోచుకొనిపోవు నిద్దుర లేచివచ్చి

లలిత సంధ్యావధూ కపోలములయందు
కమల మిత్రుండు రక్తరక్తిమ లిఖింప
శ్యామలాంగుడౌ ఒక్కనిశాంధకార
రాక్షసుడువచ్చి గుటుకున త్రాగిపోవు

బాలపల్లవాలంకార లీల తోడ
అందమొలికించు వాసంత యౌవనమ్ము
బగ్గుమను గ్రీష్మకాలం పుటగ్గిలోన
మ్రగ్గి పోవును మ్రోడువారంగ బ్రతుకు

ప్రకృతి కంఠస్థ వజప్రోరముల తీరు
వెలయు హిమబిందువుల కళావిలసనమును
నలిపి నశియింపజేయు చండ కిరణుండు
నాలివెచ్చని వేయి పాదాలు విచ్చి

శ్రావణపయోదగళిత నీరమ్ములందు
మున్ను జలకంబులాడిన కన్నెవాగు
దివ్య జీవన సూత్రమున్ త్రెంపివేయు
మండు కొనివచ్చు ఎండల దుండగీడు

చెమట రూపాన మేని నెత్తురును వడపి
నేల పెదవుల తీపిని గ్రోలు హాలము
తోడ హాలికుడు పండించు దొడ్డ ఫలము
పరులు గొనిపోదు రిండ్లకు బండ్లమీద

ఏమిటో అయోమయమ్మై దీజగత్తు
అన్యుల సుఖంబులను తన స్వార్థమునకు
బలిని గొనుచున్న సృష్టితత్త్వమును జూచి
నరనరమ్మున ఉడుకు నెత్తురులు పొంగు.



# దీపశ్రీ

రణము గావించి వీరస్వర్గమును జేరు
ధీరుని యూపిరి తిర్వళికయొ ?
దేవదేవుని సన్నిధిని భక్తవరుడు
వెల్గించు ఆత్మజ్యోతి కిరణగణమొ ?
మాతృదేశము కోసమై బలియగు త్యాగి
ప్రాణకర్పూర నీరాజనమ్మొ ?
కేవలము పరోపకృతి ధ్యేయముగ మను
పుణ్యాత్మకుని యశస్ఫూర్తి కళయొ ?

అనగ దివ్వెలు దళముగా తనరుచుండ
అఖిల జనులకు ఆదర్శమగుచు నెసగె
కాంతి మార్గము చూపి లోకమ్మునందు
వరలు గావుత దివ్య దీపాలమాల

దీపావళి చీకటిపై
కోపావళి చూపి జాతికులమత భేద
వ్యాపారమ్మును మాపి స
దా పన్నగవలె సమైక్యతా బంధమ్మున్ !

సమత సౌరభపూరము సవదరింప
మమత మకరందమాధురి మల్లడింప
మానవత పారిజాత సుమవ్రజమ్ము
వోలె దివ్వెల తోటను ఏలుగాత !

# ఉపాధ్యాయునకు ఉడుగర

నందనందనుని విజ్ఞానిగా మలచిన
సాందీపనిమునీంద్రుజ్ఞాన గరిమ
జీజీయా సుతుడు శివాజీని ఘనునిగా
దిద్దిన దాదోజి ధీబలమ్ము
కౌరవపాండు కుమారులన్ వీరులుగా
చేయు ద్రోణుని కౌశలమ్ము
గురుకులమున విద్య గరపి ఛాత్రులనెల్ల
కోవిదులన్ చేయు గురుల ప్రతిభ

వెలయ తానుగా మూర్తీభవించి సకల
శిష్యగణమును ప్రేమతో చేరదీసి
చదువు చెప్పియు శాస్త్రవిజ్ఞాన చణత
నంద జేయు నుపాధ్యాయు నభినుతింతు

బండరాతిని శిల్పఖండముగ మలచి
చెలువమ్ము గూర్చెడు శిల్పిరీతి
కదలించి వీణ తీగలపైన రాగాలు
పలికించు సంగీత పరుని భంగి
తతభిన్న శబ్ద సంధానమ్ము గావించి
కవితామృతము చిందు కవివిధాన
పసివాడు లతలకు పసిమిని వెలయించి
పూలు దార్చిన తోటమాలివోలె

జ్ఞాన శూన్యపు చీకటి సంకటమ్ము
గూడుగట్టిన చిన్నారి గుండెలందు
చదువు దివ్వెలు వెలిగించి చక్కనైన
తెలివి నించు ఉపాధ్యాయకలన నెంతు

బెత్తము చేకొని బడిలో
పెత్తనము వహించి శిష్యవితతి హృదయముల్
గుత్తగొని విద్యనేర్పెడు
ఉత్తములగు ఒజ్జలకును ఉడుగర లిత్తున్

ముత్తెముల వంటి శిష్యుల
చిత్త క్షేత్రములు చదును చేసి చదువులన్
విత్తనము నాటి విద్యా
వేత్తల నొనరించు గురులపేర్మి నుతింతున్

నీవక్షరమ్ములన్ దిద్దించకున్నచో
బాలలకు చదువు వచ్చునెట్లు ?
నీవు శాస్త్రములను నేర్పనిచో వైద్య
పట్టభద్రులగు ఉపాయమేది ?
నీవు విజ్ఞాన మందించని యెడల
శాస్త్రజ్ఞులుగా మారుదారియేది ?
నీవు బోధనమును నెరపకున్న యెడల
ఇంజనీర్లగుట కింకేది దిక్కు ?

వివిధ పాఠ్యాంశముల కళావిలసమ్ము
వివిధ విద్యాలయమ్ముల వృద్ధి గరిమ
నీ కతనగాదె సతతంబు నివ్వటిల్లు ?
ఓ యుపాధ్యాయ ! నీ కెప్డు శ్రేయమగుత !

మజ్జారే ! జనులకు సం
విజ్ఞాగృతి కలుగ జేసి విజ్ఞాన కళా
సజ్జితులను గావించెడు
ఒజ్జల మేల్బంతి ! కైత ఉడుగర నీకున్

కన్నుల పండువు గావించు చిన్నారి
పొన్నారి బాలలు పొన్నపూలు
జిలిబిలి ఆటపాటల ముద్దులొలికించి
మురిపించు పాపలు మొల్లపూలు
మాయమర్మమ్ముల మాలిన్యమంటని
పిల్లలు తెల్లని మల్లెపూలు
చింతవంతలు లేక జీవిత మింపుగా
సాగించు కుఱ్ఱలు జాజిపూలు

అట్టిపువ్వుల నవ్వుల నందగించు
తోటయగు పాఠశాల ఎంతో వెలుంగ
చూచి సంతోషమున తలయూచి బ్రతుకు
గడపు అధ్యాపకా ! నమస్కారమయ్య !

❋ ❋ ❋

# అయూరె సినారె !

అనుమాజి పేట లోనన్
జనించి, లోకప్రకాశ సద్యశమున్ గా
చిన పారిజాతపుంగ్రొ
న్నన గుత్తివి నీవు శ్రీ సినారె అయూరే !

జ్ఞాన పీఠదత్త ఘనపురస్కారము
పొందినావు ఖ్యాతి నందినావు
తెలుగు బాసవాసి దేశదేశాలలో
పెంచినావు కవిత పంచినావు

తీయనిమాటతీరు, కడు
తీయనిపాట హుషారు, రూపులో
మాయని సొరుతో తెలుగు
మామిడిమ్రాకుచిటారు కొమ్మపై
కోయిల వొచు కూతకులుకున్
పచరించిన సింగిరెడ్డినా
రాయణరెడ్డి నీకగు
చిరాయు రనామయవైభోవోన్నతుల్

వాణీపాణి చలితమణి
వీణా మృదుల స్వర ప్రవీణ ! జగా వి
న్నాణీ ! ఆంధ్ర కవీశ
శ్రేణి శిరోమణి ! సినారె ! జేజేనీకున్

మధుర భాషణముల సుధ జిల్కి జనమన
మ్ములను విలిచి, ముగ్ధముగ నొనర్చు
ధీరలలిత ! శ్రీ సినారె ! మీకు శుభాభి
నందనములు, కవనచందనములు

రాజ్యసభా సభ్యత్వపు
పూజ్యత గాంచితివి మధుర మోహన కవితా
రాజ్యాధిపతీ ! సహృదయ
ప్రాజ్ఞ ప్రశంసిత ! అయారె ప్యారె ! సినారే !



# గీతామృతము

భువనంబు లానంద పులకితంబులుగాగ

వేణుగానంబు గావించినాడు

కాళీయ ఫణి ఫణాగ్రములపై నిల్చి

గజ్జెలు మ్రోయ నాట్యంబు చేసినాడు

ఒక్కొక్క గోపిక కొక్కొక కృష్ణుడై

ఎలమి రాసక్రీడ సలిపినాడు

ఘనులైన గేస్తుల కనుల కారము జల్లి

మీగడ, వెన్నలు మెసవినాడు

అట్టి శ్రీకృష్ణమూర్తి రణాంగణమున

అరదమును నిల్పి ప్రేమతో అర్జునునకు

అందజేసిన మధురగీతామృతమును

అనుభవింపగ రండు జ్ఞానార్థులార !

జ్ఞానము కలుగగ, మోక్ష

స్థానము ప్రాపింప సంతతము నిశ్చలమౌ

మానసమున గీతామృత

పానము గావింపరండు ! పావనులారా !

దంభ సంసారబాధా సర్పదష్టులౌ

నరులకు ప్రాణదానం బొసంగి

దురితమ్మనెడుచేదు కరుడు గట్టిన జీవి

తమ్మున తీయందనమ్ము గూర్చి

అజ్ఞాన తిమిరవ్యధార్తులౌ జనులకు

ఉరవుగా వెల్గు చేయూత నిచ్చి

వివిధ దుఃఖములతో వేసారువారికి

శాంతి సౌఖ్యమ్ములు సంతరించి

యుగయుగాలుగ లోకము నుద్ధరించు

కృష్ణ భగవన్ముఖాంబుజా కీర్ణమౌచు

అలరు ఆనందదాయి గీతామృతమును

అనుభవింపగవలె భక్తులార రండు !



# వీర సమాధి

ఇది మన ఝాన్సిరాణి
　　　శయనించిన వీరసమాధి దీనిలో
పొదలుచు నున్న దిప్పటి
　　　కపూర్వ సముజ్జ్వలమై స్వతంత్రతా
భ్యుదిత మనోజ్ఞదీపరుచి
　　　పుంజము, ఝూనిసి లక్ష్మిబాయి కి
య్యది మురిపంబు గూరిచిన
　　　అంతిమ కేళికళాప్రదేశమున్

ధైర్యభావంబు విడక అంతంబుదాక
వీరబాలయై రణమున దూరి పోరి
ఝూనిసీలక్ష్మి పావక జ్వాలవోలె
క్షితిని వెలిగించి చితి నధిష్ఠించె నిచట

దేశమాతృ పరాధీన దీనవృత్తి
బాపుటకు లేతచేత కృపాణ మూని
కదన రంగాన బలియైన కారణమున
భారతీయుల కిది పూజ్యపదవియయ్యె

ఈ పవిత్ర సమాధి గాధాపదముల
జాలిగుండెతో సత్కవీశ్వరుల వాణి
పాడుకొనుచుండు వెన్నెల బయలులందు
ఆర్ద్ర హృదయాన భావగీతాళి నల్లి

భారత మాతృకాచిర

తపఃఫల పుంజము ఆయువూడిక

న్గూరికి నట్టి చోటిది

అకుంఠిత శౌర్యపటుత్వమెల్ల ఆ

కారము బూని మన్ననల

గాంచి గతించిన సీమయిద్ది యో

భారత పుత్రులార ! తల

వాలిచి మ్రొక్కుడు ఈ సమాధికిన్ !

పూనిక మోసపుం బనుల

పుక్కిటిబట్టు పరప్రభుత్వదా

వానల కీలల దనువు

నాహుతి జేసిన వీరలక్ష్మి ! యో

ఝూనిసిరాణి ! ఉజ్జ్వల

యశస్తనుధారిణి ! ఓ స్వతంత్రతా

మానస ! నీకు భక్తి కుసు

మాంజలి పుణ్యసమాధి రూపిణీ !



# హాస విలాసము

మవ్వపుమానస మెమ్మిలయ

మానవకోటి పరిమళింపగా

నవ్వుల తోట పూయవలె

నాణెపునవ్వుల మేలి వజ్రపుం

దివ్వెలు వెల్గగా వలె పదింబదిగా

హృదయమ్ములో జగా

నెవ్వగ చీకటుల్ తొలగి

నివ్వటిలన్ వలె కాంతి వల్లికల్

చెలిమిన్నమోవిపై చిరునవ్వు తొణకెనా

చెలికాని హృదయమ్ము పులకరించు

నిరుపేద పెదవిపై పొరినవ్వు తోచెనా

వానియిల్లాలు సంబరము నొందు

శ్రమ జీవిమోమున రవనవ్వు కులికెనా

జీవితమ్మున సౌఖ్యచిహ్న మెసగు

మందమతి మొగాన మందహాసము చిందెనా

జ్ఞాన లవము విన్యాస మలరు

నవ్వులెన్నియొ కమ్మని పువ్వులగుచు

పరిమళించును జీవన ప్రాంగణమున

నవ్వులెన్నియొ చిన్నారి మువ్వలగుచు

సవ్వడించును మానస సదమునందు

వికవిక నవ్వుల వికటత్వ మన్నుల
నపహాస్యమొనరించు ననువు తెలుపు
పకపక నవ్వుల ప్రకటనమ్మున అల్ప
భావనానైజమ్ము ప్రస్తరించు
కిలకిల నవ్వుల కిలకించితము సుధా
ప్రణయ మాధుర్యము తొణకరించు
కలకల నవ్వుల తులకింత చిలికింత
ఆనందమునకు సాక్ష్యమ్మొసంగు

కొసరి ముసి ముసి నవ్వుల మిసిమి పసలు
గుసగుసల మాట ముచ్చట గుస్తరించు
రకరకాలుగా మానవప్రకృతిలోని
లీల వెలయించు నవ్వుల చాలు నెంతు

క్రోధారుణచ్ఛాయ కుసిలంత పలక
మారిన నవ్వు వెన్నెల రేకలెన్నో ?
తత వేదనాతపతప్తమై వసివాడి
పోయిన నవ్వుల పువ్వులెన్నో ?
ద్వేషాగ్నికీలల వేడిమిన్ జీవ
శక్తిని గోల్పడిన చేతతీరు లెన్నో ?
మానస వ్యాధి గ్రీష్మ ప్రతాపమ్మున
ఇంకిపోయిన నవ్వు వంక లెన్నో ?

వంతవరపుకతన ఎంతనవ్వుల పంట
గాలిధూళి బ్రుంగి కరగెనో కద !
ఏపుకాపులేక ఎంతనవ్వుల తోట
ముడిగి మోడువారిపోయెనో కద ?

# అంతర్వాణి

బండలను పిండి మస్పృణ శిల్ప ప్రకాశ
దివ్యరస రూపములను దిద్దితిని గాని
గుండెలో పొరలందున కుదురుకొన్న
నీరసత మాన్పగా ప్రయత్నింపనైతి

వెదురు కఱ్ఱను పిల్లగ్రోవిగ నొనర్చి
తీయ తీయని స్వరము లూదితిని గాని
మూగ బ్రతుకులలో స్నిగ్ధరాగ మధుర
గీతికా జాలములను పల్కింప నైతిని

నేలప్రాలు తీగలను పందిరికి జేర్చి
చివురు, పూవులు సంతరించితిని గాని
అడుగునం బడి అల్లాడు బడుగుజాతి
నుద్ధరింపగ చేయూత నొసగనైతి

మిసమిసలు గుల్కు రంగులు మేళవించి
చిత్ర చిత్రాకృతులను రచించితిని గాని
మృదుల వర్ణ సద్భావ సమ్మేళనమున
విశ్వకల్యాణ కృతులు గావింపనైతి

ఉరుకు పరుగుల కెరటాల నురవడించు
నీటిలోన విద్యున్మాల పాటవింటి
గాని పేదల కన్నీటి కణములందు
నొలయు వెచ్చని గుసగుసల్ తెలియనైతి

సృష్టి సౌభాగ్యదాయక శ్రీకమగుచు
లోక సౌహార్దకలనా ప్రతీక మగుచు
తనరు మానవతకు నవతామనోజ్ఞ
మణికిరీటము గైసేయ మలయనైతి



# చెరసాల

ధర్మ సంరక్షణార్థము దేవకీసూతి
కృష్ణు డిట అవతరించె ననుచు
ఘనుడైన బాలగంగాధరతిలకిట
గీతకు వ్యాఖ్య లిఖించె ననుచు
అనయమ్ము గాంధీమహాత్ముని నిరశన
దీక్ష ప్రభుతను గద్దించె ననుచు
బాధితస్వాతంత్ర్యయోధు లెందరో ఇట
నిండి బందీలుగా నుండి రనుచు

కథలు, గాథలుగా చెప్పగా బడుచును
తరతరాల చరిత్రను త్రవ్విపోయు
వింత వింతలైనట్టి ఉదంతములకు
కారణములు కారాగార గతులు, స్థితులు

కూటసాక్ష్యమ్ములు పాటించి తాటించి
చెరసాల బందీగ జేసి రనుచు
ఒక చిన్న తప్పన కకట పదారేండ్లు
శిక్షగా జైలుపాల్జేసిరనుచు
అన్యాయముగ నేర మారోపణము సల్పి
పట్టుక జైలులో పెట్టిరనుచు
అడవిమానిసిగ మన్గడసల్పు నను దారి
దోపిడీడని ఖైదు చూపిరనుచు

క్రేవగ కటకటాలు లెక్కించుకొనుచు

గోడలకు తమగోడు వాకొనుచు మనుచు

పులుగులవిధాన చెరసాల వలను దవిలి

ఎందరెందరొ ఖైదీలు కుందుచుండ్రు

అరచేతులన్ బొబ్బ లతిశయించుచు నుండ

నెట్టన బండలు గొట్టి కొట్టి

గరిగొను పురుగులు దొరలుచు హేయమౌ

ముక్కిపోయిన కూడు మెక్కి మెక్కి

బ్రతుకెల్ల కష్టాల పాలయ్యెననుచు

ఉగ్గడువుగా కన్నీరు కార్చి కార్చి

గాలి వెల్తురు లేని గదిలోపలన్ జిక్కి

చివికిన మేనితో నవసి నవసి

ఆయువెల్లను చెరసాల అప్పగింప

ఏండ్లు పూండ్లుగా ఈ కడగండ్లతోడ

ఉండవలెనా యటంచును గుండెలవియ

ఎందరెందరొ బందీలు కుందుచుండ్రు.

చోరులు, హంతకులు, దురా
చారులు నేరముల ఘోరచారమ్ములకున్
దూరమగు నటులుగా సం
స్కారము చేకూర్చవలయు సంస్కరణవిధిన్

నేరమ్ముల్ పలు రీతులన్ సలుపు
బందీలైన వారల్ సదా
చారోద్దేశము నాకళించుకొని
పశ్చాత్తాపచిత్తంబులన్
కారాగార విముక్త జీవితము
సౌఖ్యం బొప్ప నిర్దోష భూ
షా రమ్యమ్ముగ, శాంతి సౌమ్యముగనున్
సాగించుతన్ నిత్యమున్



# రంగవల్లికలు

తెలుగు టూహలు తీగలై అలరినట్లు
తెలుగు వెలుగు దువాళించి వెలసినట్లు
తెలుగు సీమల సౌభాగ్యకలన దనర
రంగవల్లిక లొప్పె సంక్రాంతి వేళ

తేటలై, మేలిముత్యాల కోటలగుచు,
రేకలై, పండువెన్నెల వాకలగుచు,
తేరులై, జనగణ మనోహారులగుచు
అల్లి బిల్లిగ తెలిమ్రుగ్గు లుల్లసిల్లె

రమ్యరూపిణి యగుచు సంక్రాంతి లక్ష్మి
వచ్చుదారుల గౌరవ మచ్చుపడగ
పరపు మక్మల్ తివాచీలు పరచినట్లు
రంగు రంగుల మ్రుగ్గులు చెంగలించె

మంజుల తుషారహీర సమంచితమ్ము
ప్రాగ్ది శారుణ శోభా విరాజితమ్ము
మాంగిలిక రంగవల్లికా మంటపమున
కులుకు తులకింప గొబ్బెమ్మ కొలువుదీరె



# అహింసాకుమారి

బుద్ధుండు కరుణా ప్రబోధంబు గావించి
నెత్తురు పూజ మాన్పించునాడు
సమ్రాడశోకుండు శత్రురక్తాంకిత
ఖడ్గమ్ము కన్నీట కడుగునాడు
జగతి సంచారముల్ సాగించి బౌద్ధులు
శాంతి సందేశముల్ చాటునాడు
మనుజసంఘము కూర్మి తొణకించి చీమబం
తికి పంచార తిన్పించునాడు

బోసినవ్వుల నమృతంబు పోసి గాంధి
నెనరు జనహృదయముల పండించునాడు
భరత జనయిత్రి యొడిలోన పెరిగినట్టి
మా యహింసాకుమారికి దోయిలింతు

ప్రేమ హారము వల్లె వేయించవచ్చును
బుసకొట్టు పెనుబాము విసపునోట
భూతదయా గుణంబును ముద్రయిడవచ్చు
కొదమసింగము వాడి కోరమీద
గిలకొట్టి జాలితేనెలు పిండవచ్చును
బండబారిన వైరిగుండెలోన
సాధు భావంబును సవరింప వచ్చును
పులిరాజుమీసాల బుగ్గలందు

శాంతి నెదురొడ్డి తలవంపు సలుపవచ్చు
పచ్చినెత్తురు త్రాగు కృపాణమునకు
పావనంబైన నీప్రభావంబుకతన
సంతతానందమయి ! అహింసాకుమారి

నీనవ్వు పండువెన్నెలలు కాసిన చోట
హింసా తమంబు హరించిపోవు
నీ పల్కు పసిడి వీణియలు మ్రోగిన చోట
ఆనందలక్ష్మి నాట్యమ్మొనర్చు
నీ చూపు చలువ పన్నీరు చిల్కినచోట
ఖడ్గదేవతచేయి కడిగికొనును
నీ స్వరూపంబు పెన్నిధి బయల్ పడుచోట
కారుణ్యదైన్యంబు తీరిపోవు

నీ పద న్యాసగరిమ సంధిల్లుచోట
కఱకు గుండెలు నిలువున కరగిపోవు
నీవు నెలకొన్న చోట ధ్వనించు బుద్ధ
చరితఘట్టమ్ము లో అహింసా కుమారి !

✿ ✿ ✿

# కుంకుమ తిలకము

ప్రత్యూషవేళలో ప్రాగ్దిశాముఖమున
విలసిల్లు బాలార్క బింబమట్లు
పడమట దెసపైడివన్నె మేఘముల
అచ్చపుమలుసంజకెంజాయ రీతి
గుబురు టాకుల మధ్య కోమల చ్ఛాయతో
తళుకారు మందార కళికవోలె
పండిన పచ్చని ఫలములో దళముగా
గీల్కొను దానిమ్మగింజ భంగి

భారతీయ కాంతామణీవదనమందు
నిద్దముగ ముద్దు ముద్దుగా దిద్దుకొన్న
అలక శోభిత కుంకుమ తిలకరేఖ
పొలుపుగా కలకాలము వెలయుగాత !

పసుపుంగుంకుమ భారతీయ మహిళా
వాళ్ల భ్యసౌరభ్యభ
వ్యసుమాంగల్య విశేష భాగ్యకలనన్
భాసిల్లి పూబోణిమేల్
నొసటన్ దోచియు చూచువారి కనువిందున్
జేయు చుండున్. కళా
కుసుమ శ్రీవెలయించు కుంకుమపు
నిగ్గున్ జగ్గు వుగ్గించెదన్

కుంకుమ తిలకము తోడన్
పొంకముగా నలరు నుదురు పొసగగ మహిళా
లంకారను ముత్తైదువు
పంకించెద గౌరవాదరాతిశయమునన్

సంకజము వెలియైన కొలంకువోలె
కుంకుమ తిలక రేఖా శుభాంకితముగ
కలిమి చూపక వెలవెలా వెలదిమిన్న
మోముదామర చూడ్కికి వెగటు గొలుపు

మెత్తని పసుపుంబూతల
పుత్తడి జిగితోడి మోము పులుగడిగిన మేల్
ముత్తెమ్మై కుంకుమతో
ముత్తైదువు నకును కేలుమోడ్పు ఘటింతున్

ఏనాటి సంప్రదాయమొ
మానక ముత్తైదువులకు మంగళకరరే
ఖానై పద్యము గూర్చును
ఈనాటికి కుంకుమ తిలక మెంతయువేడ్కన్



# పూల మేల్బంతి

నున్నగా దువ్వి పొందుగ ముడిచిన పల్లె
పడుచుల కొప్పులో పరిఢవిల్లి
పసిడి నిగ్గుల తోడ నెసలారు వరిచేల
గట్టుల కందాలకలిమి గూర్చి
సంక్రాంతి పర్వము సమయాన మందిర
ద్వారతోరణలుగా పరిణమించి
గోమయకృతములౌ గొబ్బిళ్ళ శిరమున
కలికితురాయిగా కందళించి

పసుపు చాయలు, కుంకుమ వన్నె గలిగి
ముద్దరాండ్రను మురిపించు ముద్దబంతి
పూలు విలసిల్లు ప్రకృతి కాంతాలలామ
జిలుగువలువ జల్తారు కుచ్చెళ్ళు లగుచు

హేమంతవేళ బంతులు
సామంతములై ధరిత్రి సౌభాగ్యవతీ
సీమంత కాంత కలనా
శ్రీమంతము లగుచు సంతరించును శోభల్

పల్లెటూరి పేదవారలు తమయింటి

వెనుక పెరటిలోన పెంచుకొన్న

తోటలోన పూచి నీటు గుల్కెడు బంతి

పూల జూచి మురిసిపోవుచుంద్రు

పరిమళము లేని వైనను

సురుచిరూపమ్ముతోడ శోభిల్లుచు మేల్

మురిపాలముల్లె లగుచును

మురువు గొలుపుచుండు బంతిపూవులు జగతిన్



# హిమకణము

పచ్చని తీవ పైదలి

ప్రవాళమనోజ్ఞనవాధరమ్ము పై

విచ్చిన నవ్వు మొల్కవుగ,

వెన్నెలలో చిరుముత్తియమ్ముగా,

పచ్చని నేలముత్తయిదు

పాపటలో గయిసేసుకొన్న క్రొం

బచ్చవుగా తుషార కణమా !

మురిపింతువు లోకమంతటిన్

లలిత హేమంత ప్రత్యూషలక్ష్మి నిన్ను

రమ్యమైన వజ్రాల తురాయిగా ధ

రించుకొని గౌరవించుచు మంచుకణమ !

అలతియైన నీ బ్రతుకులో విలువగూర్చు

ఉదయగిరి మీద పాదము లూని లోక

బాంధవుడు వేయిచేతులు పరచి నలిపి

వేయగా గుండెలవిసి కన్పింప కుండ

అణగిపోదువు తెలిహిమకణమ నీవు !



# తెలుగు శిల్పి

ముట్టిన మాసిపోవగల
ముగ్ధమనోహర రూపముల్ శిలా
ఘట్టములందు జెక్కి
కలకాలము శిల్పకళా జగత్తునన్
పట్టము గట్టికొంటివి
అపార చమత్కృతి వార్ధి ! శిల్పి స
మ్రాట్టు ! నమశ్శతమ్ము గొనుమా !
చిరకీర్తి కిరీట ధారివై

వాడిపోలే దింక ప్రావీణ్యమొలికించి
నీవు చెక్కిన నాటి తీవగుంపు
మాసిపోలేదు బొమ్మల నెమ్మొగమ్ముపై
నీవు రచించిన భావగరిమ
తగ్గిపోలేదు నిద్దపుపాలరాలపై
నీవు చిల్కిన కళాశ్రీవిభవము
చెదరిపోలేదింక చిత్రాలపై నీవు
అద్దిన రంగుల ముద్దు నిగ్గు

కాలసాగర గంభీరగర్భమందు
కలిసిపోలేదు నీ నేర్పు పాలుపు మెలపు
ఎన్ని యబ్దముల్ గడచిపోయిననుగాని
శిల్పిమార్తాండ ! నీవు శాశ్వతుడవోయి !

